

శ్రీరస్తు.

## గజేంద్ర మోక్ష దండకము.

శ్రీమద్భవానీహృదంభోజ భృంగా లసన్నాకగంగా ఝురీపూతసారోత్తమాంగా కరాలంకృతాంచత్కురంగా వృషాటత్తురంగా సులింగా మహాదారుకారణ్యకాంతాభుజంగా శితాంగా భయంకారఘీనాంకఝూంకారవచ్చాపటంకారనాశంకరా శంకరా భక్తమోక్షంకరా వీరభద్రా హతత్కుద్ర రుద్రా భవద్దివ్యనామాంకితంబొప్ప నాభాగవద్గ్రంథము దుల్లసద్బ్మైరాంచత్కులాబ్ధిందుడాపోతరాజప్రణీతాష్టమస్కంధసంధానితాంచచ్చరిత్రంబు నేబుష్కరాంభప్రచండోగ్రఘోర్మీరవాఖండవాభ్యండలోద్దండతరి జండవేదండశాద్దండకం బాకరవ్రాదండగా జెప్పి యొప్పించెద న్నీకు నాత్మప్పలుల్లంబుసందొప్పులుంగా గటాక్షింబు యాలించవే తత్కథామాధురీసాధువాదంబు లెట్లన్న శ్రీపద్మగర్భాండభాండప్రకాండంబులన్నింటి రేయొంటభంగిం బ్రకాశించు కీర్తిప్రతిష్ఠామహాప్రైబు డంచత్పరీక్షన్మహారాజుతోడం జతుర్వేదవేదాం

తసారాంశసమ్యగ్భృతుం డాతుడుం డాదరాయత్త చిత్తం
బుతో ఘోరనక్రగ్రహాగ్రస్త హస్తిప్రభుం దీనరక్షాను
భావుండు శ్రీవాసుదేవుండు తన్నక్ర నిర్వక్రబాధ న్నిరో
ధించి పాలిణప్రదానంబుగావించెనందున్ వచించంగ విం
చాపరీక్షన్మహారాజ యోమానిచండాప్తి మహాభీర ఘో
రాటవిం జాలటవ్యాట నీరాటయుగ్మంబు కేచోట బో
రాటమేరూటివాటిల్లె నారాటమేపాటిగాను న్నికోటా
రిచే నీటుగల్పంబడెన్ మానిలోకేశనాకేశ ఘాసారపూరం
బు తోరంబుగా నారమారాటకథాకర్ణ నామోదరుం
ధ్రింబులౌ కర్ణరంధ్రింబులన్సోకగా జెప్పవేయన్న నమ్మా
నివర్యుండనుం గార్యనిర్వార్యతూర్యస్వనాదార్య వాగ్వై
గ్యధుర్యంబుగా నోన్నృపగాగ్రిమణీ నీవు దత్తావధానుండ
వై యాలకించందగున్ శ్రీవిరాడ్యోగమాయా సుతంత్రం
బునా పాలసంద్రంబులో రంగుబంగారుపొంగారు శృం
గాలచే సంగతంబైన తారావధూటీ లలాటంబు కుంభ
త్రికూటంబనే పేర బల్గొండయొండాయుతఖ్యాతమా
యోజనాయామమై నంతియేనిన్ వెడల్పై విరాజిల్లు నం
దగ్రరత్నప్రభాభాసిత శ్వేతగాంగేయరంగంబులై మూ
డుశృంగంబులొప్పారు తత్పర్వతంబింక భల్లాతకీమాతు
లాగ్రమాతకీ చూతవైభీతకీ కేతకీ కుందమందార సచ్చం
దనాశోక ఖర్జూర మల్లీ మధూకోజ్జ్వలన్మాధవీ మాలతీ

తాల తక్కోల హింతాల సాలప్రియాళూల్లస జ్జంబుజం
బీరరంభాకదంబాంబవీగంధ షడ్గ్రంధికా సింధువారా
మ్రకర్కంధుబంధూక హింగూ లవంగీ విళంగైలకీ మా
తులుంగత్రుటీ పూగపున్నాగసన్నాగ తాళీతమాలద్రు
మైరండ భేరుండికాతింత్రిణీ నారికేళాది నానావిధ క్ష్మా
రుహశ్రేణి శాఖానుశాఖోపశాఖల్ వసంతర్తుకాలాను
కూలాభిసౌభాగ్యసంపత్తరాంకూరవారంబులై కాయ
లుంబిందెలుం బండ్లు పూవుల్ చిగుళ్లెల్లజంగళ్ళ నేజామ
హారాజరాజద్విభూత్యైక వాసంతికా మాధవారాధ
నాధారకృచ్ఛోభనద్రవ్యముల్ బోలిశోభిల్లు నద్దివ్యశైలం
బు సంస్తవ్యమైనవ్యమై మల్లికావల్లికేలాలతాజాతివల్లీవ
లన్మాన కుంజచ్ఛటారాజమై తేజమై జృంభితాంభోజమై
సంభవద్భీజమై పూజమై వాలుకానేక స్రోతస్వినీ సైక
తాళీప్రవాళీ లతోద్యానకేళీ మిళత్కీరపాళీ పికత్రోటి
కూలీ దళద్దేవతాళీ లసన్నారికేళీ వయస్థారసాళీ మ
ధూకామ్రకోలీఫలాళీ బిలోద్భిద్రసాళీ ఝురీజాలమై సా
లమై శీతవాతూలమై దేవతాఖేలమై కూలమై ధూతభే
తాలమై తాలమై నీలరత్న వ్రజాఖర్వ తత్పర్వతాంధీభ
వత్కందరప్రాంత లీలావహద్దేవగంధర్వవిద్యాధరద్వం
ద్వసందోహకృన్మోహనానోన్య సంలాప సంగీత రంగ
త్ప్రసంగాభిశృంగారమై సారమై నిర్ఝరాగారమై నిక్వాణ

త్కారమై కుఠారమై పుష్పరాజీరజఃపూరమై భారమై
తారకాధారకృత్తచ్ఛిరఃపాతసాయాతస్రోతస్వినీజాత
భీతారవా నిర్గళద్దిగ్గజానీక కర్ణద్వయీరంధ్రమై రుంధ్ర
మై శాఖిశాఖాగ్రజాగ్రన్మహాచ్ఛంద్రమై చంద్రమై సా
న్నతాగేంద్రమై మంద్రమై సాంద్రవద్గండ భేరుండ కంఠీ
రవక్రోడసారంగసాలావృకాద్యుల్లసద్గర్జితు సంతానకృ
త్స్వాంత కాన్త్యాన్యజన్యాగ్ఘటీకంపిత ద్వాదశాత్మా భయో
త్పాదమై మోదమై వల్లకీనాదమై మల్లికామోదమై శ్రీద
మై వైభవాపాదమై మేదురస్వర్ణసోపానసమ్యక్సరస్తీ
రవీచిత్సమామోద బోధావహాద్యాతపో తానుధూతా
బ్జినీ డోలికాకేళికాలంచన్మరాళీ వరాళీకరాళాకమై కా
కమై బర్హికృత్కేకమై టిట్టిభోలూకమై కోకమై పంక్తి
శ్లోకమై భేకభుగ్లోకమై శోకమై కిన్నరాగణ్యవిన్యాకమై
నాకమై ప్రేక్షణానూకమై వీక నానాజలస్థాన సంచార
కాదంబ కారండ కోయష్టికా ద్యంబుపక్షి చ్ఛటా కృత్యో
కోలాహలధ్వానమాన త్రుటిత్తారకాబృందమై మంద
మై వీక్షణానందమై కుందమై పుష్పమారందమై చిత్ర
మాకందమై కందమై యందమై యొప్ప నప్పర్వత శ్రేష్ఠ
మందుంగళద్భృత్తులంగోత్కబేరోత్కని దంతావళశ్రేణు
లెల్ల నృపీక్షాభయంకారరూపంబులై చీకటుల్ భీతిచేదద్ద
రాభద్గుహాంతంబులందుం బవల్ డాగి యాసంజ కర

జాగరూకంజాప్తవృద్ధత్వముం దెల్పగా లేచి తత్కందరాం
తంబులందుండి వేంచేసెనో యన్న భంగిం బిపాసాకు
రాయత్తచిత్తంబుతో మత్తకుంభిచ్ఛటల్ దంభజంభారి
గంభీరదంభోళిధారావిహార ప్రకారంబు ధాటి న్నిరా
ఘాటసంచారకేళీవినోదంబుతో దద్గుహాద్వారముల్ దా
టి కోనేటికిన్నేటికిన్ సూటిగా బోవుచుండంగ దద్వారణా
న్యోన్యసత్పాదవిన్యాస దోస్స్పర్శనాశ్లేష ఘీంకార లీ
లావిలాసాదికోలాహలార్భాటిచే నన్యసామాన్యవన్యో
ల్లసజ్జంతుసంతానముల్ చింతచే గొంతవిభ్రాంతిచే ఖం
చటంగాళమాచుండగా గుంభికుంభద్వయీసంభవద్దాన
ధారాపరిప్లావోదరాంతంబులై భృంగముల్ మంగళా
నంగసంగీతముల్ పాడగా దత్పదక్షుణ్ణమోటక్షమాజో
దరూటక్షారుణక్షోమమాకాశభామామరీచంబుల్ పిధానిం
చగా శస్త్రహస్తాంచలోదస్తవిస్తారవిన్యస్త పక్షిక్షురన్యా
సవిక్షేపమోక్షప్రసూనప్రతానంబులుం దద్వనీదేవతా
సైజపూజావిధిం దెల్పగా లీలకన్యోన్యదంతంబులం టాకు
లాడించుచో బుట్టు టక్టిక్కటాలన్న శబ్దాలకున్ శాకినీ
ఢాకినీభూతభేతాళవ్రాతంబు జేతంబులం భీతి వాటిల్ల
గా నేనుగుల్ వచ్చుచుం బల్లవాఘ్రాణముల్ జేసి మట్టా
డుచున్ భూజముల్ ద్రోయుచున్ లేతకొంపంబులన్ మే
యుచుం గొమ్మలం గోయుచున్ బోతులం గోతులం జేసు

లన్ వ్రేయుచున్ మేలెక్కలంకుల్ కళంకంబుగా జేయు
చుం గొండలందుండి గొబ్బిళ్లు గోరాడుచుం దొండముల్
జాపుచుం బువ్వులం దోపుచుం బత్తులన్ లేపుచున్ సింగ
ముల్ డాపుచుం బ్రాణముల్ చాఱుచున్ దానముల్ దేపుచు
న్బద్మముల్ మాపుచున్ బోవుచున్నిల్చుచుం దోటియేనుం
గుఱుంగొమ్మలందిచ్చుచున్ మెచ్చుచున్ మెచ్చియందిచ్చు లే
వచ్చికొమ్మల్ పెరింగ్రిచ్చుచున్ వచ్చుయాకుంజరీకోట్ల
లో నాకదంతావకేంద్రంబు తాజిక్కి 'తృష్ణార్జసా
ధూతలై ముంగలన్వెన్కమధ్యన్ ద్విపార్శ్వంబులన్ వ
చ్చునక్రైస్గమొత్తంబులంగూడి సర్వేశ్వరాయత్తతం జిత్త
ము స్వత్రముంగాని చే నొత్తి తానుం గరేణుప్రజంబా
కఱిమార్గంబునే బోవుచూ బల్వలశ్రేణి లేపచ్చికన్ మచ్చి
కన్నెద్దెరి బంతికందిచ్చుచూ గమ్మపూగొమ్మలం గానర
గానిచ్చుచూ శీతకర్ణద్వయీ తాళవృంతంబులం దోటియే
నుంగు మైంగ్రిమ్ము జెమ్మటల్ జిమ్ముచూ నెమ్మితో గొమ్ములం
గంధరమ్ముల్వడిందువ్వుచూ దొండముం దొండము న్పెన్చు
చూ కెన్ని మూరొల్కెందు గ్రీడించుచూ మత్తమాతంగమ
ల్లంబు శ్రీవినోదాభిసౌభాగ్యుడై యాత్మకుంభద్వయీ
పూర్ణతన్ యానగంభీరతన్ హస్తవిస్తారమున్ దంతవి
భ్రాంతకాంతిన్ వపూరూపలావణ్యముం గాంచి యా
హింగళాతామ్రపర్ణీశిలేభాంజనాద్యష్టకాష్ఠేభరాడ్దయి

తలున్ వెంటనే తేర నానామహారణ్యమాద్యద్విహారంబు
తోడం గజేంద్రుండు తామార్గముందప్పి భాస్వత్ప్రపా
పాపరాయత్త చిత్తంబుచే నుత్తరుండాలి మొత్తంబులుం
దానుదవ్వేగి యచ్చోట మందన్మరుత్కందళాంద్రోర్మితేం
దీవరాళీరజస్సుం దదాటన్మిళిందాళి ఝంకారపుంఖన్మ
హాస్సుందటోద్భిత్తమాలైలకీమాలతీప్రస్పనల్లీవతత్యుం
జరంజత్తమస్సుం దిమీకచ్ఛపీమత్స్యళీ ప్రచాఛ్యానచ్ఛ త్ప
యస్సున్ స్వశేపార్థకృత్కృహ్వ మాయాతపస్సున్నద
తోర్మికహంసాది నీరాండజోద్యచ్ఛిరస్సున్ లసన్నానసా
ఖ్యాతిరస్సున్ సరస్సున్విలోకించి కించిత్సరోరాజ రాజీ
వరాజీవరాజత్సమీరంబుచే మేను లింపొందగా గోకిలా
కాకలీవాకలీహంస కూహూకుహూ స్విస్వనాస్ఫాటచే
గర్ణముల్ తుళ్ళగా ఫుల్లదిందీవరాంభోరుహామోద వి
స్ఫూర్తిచే నాసికల్ కిట్టుమట్లాడగా నిర్మలోర్మి సరస్నీర
మాధుర్యధుర్యంబుచే జిహ్వలంటుల్పు దుళ్ళించగా శ్రీ
జగన్నాథ సౌభాగ్యసందీప్తమౌ వైభవస్ఫూర్తిచే గం
డ్లకానందముప్పొంగగా దాముపంచేంద్రియోద్యోగమం
దుంబరామోషలై దంతిసంతానముల్ తత్సరోరత్న
మూంజొచ్చి తొండంబులన్నీరుబూరించి గండంబులంజల్లు
కొంచున్ గళధ్వానముల్ మెండుగా గొప్పచున్ భూరిప
ఘాండంబులన్నిండ నాకుంచెదండముల్ నీరుద్రావంగ

రేణుప్రభుండప్పుడున్ హస్తరంధ్రింబుల న్నీరమాకర్షించి
పూరించి ఫూత్కారతారంబుగా రైక జిమ్మంగ దన్నీర
ధారాభిషేకంబుచే దత్కరీపాద సంఘాత ఘాతావనీ
జాతధూళీ విలిన్నాకపంకంబు బోచుండగా ఘుగ్గుఘు
గ్ఘుఘుగధ్వాన ఫేనోల్లసద్భంగముల్ నింగి కుప్పొంగగా
నుం భయంకారహుంకారఫూత్కార నీరారవార్భాటి
చే ఘోరనక్రగ్రహాకోటి భీతిల్లగా వాలవిక్షేపదుర్వా
ర జంఝూసమీరంబుచే ఘుమ్మ ఘుంఘుం ఘుమావర్త
ము ప్పారగాభంగసంఘట్టనాపత్తటీవృక్షముల్ వ్రేళ్లతో
భూమిపై గూలగా గచ్ఛపీమత్స్య మండూకాండజ వ్రాత
ముల్ గిందుమీదౌచు బ్రాణావశిష్టంబులై యుండగా వా
రణేంద్రుండు నిర్వారణుండై జలస్నానకేళిన్ వినోదించు
చుండంగ దత్కాలమందాసరోరత్నమందుండి వీక్షిం
చి రోషించి కుప్పించి లంఘించి తా హుంకరించన్ పై
మార్తాండబింబంబునం బట్టు రాహుగ్రహంబట్లుగా
శింశుమారగ్రహంబాక్కటా నాగలోకేందునిం బట్టె
వప్పట్టునం దంతిరాజపై తొండంబు బిట్టెత్తి కొట్టంగ
నాకొట్టుతో నాళజాలంబుకున్ మట్టి తన్నుగ్రమున్ విక్ర
మక్రీడవేళోదనే నాగరాట్పూర్వపాదద్వయిం బట్టగా
నవ్యాడహ్యోగ్రజేడాయ్యనన్ దంతకుంతాంత సంఘట్ట
నన్నక్రశల్ మేనిబిస్ఫుల్ఘ దిందూలి బెంజిమ్మగా శింశుమా

రంబునవ్యగ్రతోండంబమూలంబుగా గోరులంజీరెని
ట్లాగజానీకరాట్సింశుమారంబులున్ రెండు నొండొం
డనుద్దండశౌండంబులైడాకి లోకేక్షణాంభోజరా డ్రా
హులై దుర్మదోత్సాహక్షుద్దేహులై సంతతాన్యోన్య
సంయుజ్జయశ్రీమహామోహులై క్షోభితాంచత్సరఃపం
కరుద్ధాహులై తాడనాపీడనారోహులై స్వేదసందో
హులై సింహమున్ సింహముం గొండయుం గొండ
యుందాకి బేర్చింబెనంగేటిలీలద్దులేనట్టి పోరాటముం
బెట్టుచూ లోనికిన్వ్రాలిబోచూ గొలంకుం గలంకంబు
గాగల్పుచూ బుస్బుశత్కారమాచు న్భుగుల్లన్నుచప్పుళ్ల
తో నుర్వులంగట్టుచూ నీరసుం దారకామండలంబంట
ఫూత్కారముల్ శేయుచూజండశుండాప్రకాండంబులం
దుండఖాండంబులన్ వ్రేయుచుం సంతతైకాంతకృద్దంత
కుంతంబులం బన్కిచిప్పల్ కుదుళ్లూడి రక్తంబులుం గ్రి
మ్మనోకుక్ష్మడిం జిమ్ముచూ ఘోర పారస్పరాకర్షణం
బుల్ బదంబుల్ మొదల్పట్టులన్వీడకన్ గట్టిగా బట్టుచూ
విభ్రమచ్చారవేగంబున న్నీటిలో మాటికిన్మాటికిందూ
టుచూ మీటుచూ దాటుచూ గందమందూక గందూప
దీర్ఘపాద్యంబుచారంబులుం దాము జీవావశిష్టంబు
లై యొండునొండొంటతో దాకగా ద్రొక్కుచూ గుల్ల
లంజిప్పలన్నాడుతండంబులన్యోన్య సంతాడనశ్రేణి క

డ్డంబుగానొడ్డుచూ రిమ్మి పల్గొమ్ములన్ గొమ్ములంగుమ్ము
చూ జిమ్ముచూ వెన్నులుంజన్నులుంగన్నులున్ పన్నురోం
పిన్విలేపించుచూ మేలికీల్సంధులన్ వ్రేయుచూ గూయు
చూ మేనుమేనంటగా రాయుచూ బాయుచూ డాయు
చూ మోహపాశంబులం గోయుచూ ద్రోయుచూ గల్ప
తల్పుల్ బయల్ గొల్పుచూ సల్పుచూ దోంసముల్ మల్పు
చూ నిల్పుచూ నీరముంగల్పుచూ నాగరాణ్ణక్రముల్ రెం
డహూరాత్రముల్ బోలె సంతెంతకున్ వింతగా జృంభ
మాణంబులై జాలకాలంబు సంగ్రామభీమంబులై నిర్గ
తాహారనిద్రాశలై దారుణావక్రసద్వక్రనక్రక్రీడలై పోరు
ఘోరంబుగా జేయుచున్నంత నానీరచాగంబుతో పోరు
సారంగరాజోక్కనిం డించి పోగాళ్లురాకన్ విచారాబ్ధి
కగ్రస్తులై హస్తినీయూధముల్గోరి వీక్షించుచుండెన్ మ
రింజీవనంబేదనోకస్సుయుం జీవనాధారమాటం జలం
బుంబలంబుం బయశ్చ్రాగికంతంతతకున్ హెచ్చి తా శుక్ల
పక్షాంతనక్షత్రరాడ్భంగిగానొప్పె నిద్రాబలాహారము
ల్లేక దంతీశుడంతంతకుండస్సి తాకృష్ణపక్షాంత తారా
పతింబోలిశోభిల్లె నిట్లాకరీంద్రుంను శోషించుటన్నీరచా
రంబు జృంభించి కుంభీశ గంభీరకుంభద్వయిన్ సింహ
ముంబోలిలంఘించుబాదంబులంబట్టి చిట్టాడు గంతంబు
జీరున్ శక్షింపన్నున్నవాడు దామస్థుమంచున్ హటా

యుంచిదాటుంధరంగూలశల్యంబులందంతముల్ వ్రేయు
బాంచుండి హత్తుంబాడంగ నరాతుండు డాగున్వడిన్ వె
లిక్కిబోవంగదానడ్డమై యొడ్డి గానంబడున్ మాటికిన్ దా
టు లేచున్ మిటారించి బోరాక రారాక గాల్లం బెనం
గున్ దొలంగున్ మలంగున్ జెలంగున్ మెయింజీరు వేధించు
గ్రోధించు నిట్లా వినిర్వక్రపున్ విక్రమంబైన నక్రంబుచే
గ్రించెతమైనట్టి పాదాలు వీడించుకోలేక సందేహముం
బొందు దేహక్రియన్ దీనహృత్తుల్యమైనిర్మలామూల్యమై
యుద్ధసాకల్యమై కల్యమై భీషణగ్రాహదంతాంతఘా
తావశిష్టీభవచ్ఛల్యమై శత్రుసంహారవైకల్యమై యేన్గు
రేడాపయశ్చారతోడన్ దివంబుల్నిశల్ సంధ్యలన్ గోర్కి
తో వేయిసంవత్సరంబుల్ మహామత్తతన్బోరు ఘోరంబు
గా జేసి యాత్మీయశక్తి న్బ్రయశ్చారిశక్తి న్విచారించి మి
ధ్యామనోవాంఛలింకేటికిన్ దీనిగెల్వన్ సరింబోరగా జా
లవాదందు దాబూర్వపుణ్యాగతజ్ఞాన సంపత్తితో నిట్ల
నుందీని నేరీతిగా గెల్తు నేనింకనీమీద నేదేవునింగొల్తు నె
వ్వారలంబిల్తునింకెవ్వరడ్డంబు నివ్వారిచారంబు వారించ
గాదగ్గవారెవ్వరేదిక్కులేనట్టి యీనా మొరాలింప బ
ధ్వ్యాత్మకుల్ చిక్కులేకేమదిన్ మ్రొక్కెదన్ దైవమా యే
మి నానాగజంబుల్వనశ్రేణిలో బెద్దకాలంబు నన్నారవిం
పన్ ద్వపంబోల్లస ల్లక్షకోటీశరీందుర్లిండనై యుండి మ

ద్దానధారా పయఃపూర మందార సచ్ఛందనాంచత్సు
మచ్ఛాయలం దండగాలేక నేదేహదాహంబునై దా
హమోహంబుచేదప్పి నీరాశకై చ్లైల నేవచ్చితన్ వచ్చి
యీ శింశుమారంబుచే జిక్కి తింకెవ్వరిం దూఱ దె
వ్వానిచే నీజగంబుల్ జనించు న్వశించు న్నశించు న్పర
బ్రహ్మ మెవ్వాడు లోకేశులన్ లోకముల్ సర్వ లోకస్థ
లుం డిందువెనకంద లోకాంధకారంబుకుం బైన నె
వ్వాడు మేకాకృతి న్వెల్గు దా నాదిమధ్యాంతముల్
బొంద కేకాకియై పీలకాద్యంబుతుడ్యోని పర్యంతమున్
బ్రాణికోట్లందు జీవేశ్వరత్వంబుచే నైక్యభావంబు
బొందేటివా డెవ్వ డష్టాంగ యోగీశ్వర ధ్యానకృ ద్దేవ
తాకారు డెవ్వా డవిద్యాజనాసాధ్యమౌ బ్రహ్మవిద్యాగ
మోద్యోగ సంవేద్య విద్యుత్సుషుమ్నాకడంభాను తాం
చత్సహస్రారపద్మంబునన్ హంసరూపంబుచే నెవ్వడా
డున్ మునీంద్రుల్ సురల్ దేవతాయోను లెవ్వానికీర్తింప
గానేర రెవ్వాడు శైలూషిభంగిన్ విశేషానువేషాలతో
నాడు సంసారముం గర్మము న్నామముం దాపముం గో
పమున్ రూపమెవ్వానికిన్ లేక నాత్మీయ మాయావిశేషం
బుచే లోకముల్ బుట్టగిట్టింప నిన్నింటనిండాల్పు నెవ్వాని
దీజంగమస్థావరాంతర్బహిర్వ్యాపకంబైన తేజంబు మో
క్షంకరం బెవ్వ డోంకారగేహంబుకుం దీపికాకారు డె

వ్వండు బ్రహ్మర్షి దేవర్షి రాజర్షి మర్త్యాదు లెల్లం దప
స్స్తోత్ర సత్రాదు లెవ్వాని సంతృప్తిఁ జేయు నిర్ముక్త ధ
ర్మార్థకామేచ్ఛులై సాధు లెవ్వాని సేవించి యిష్టంబు జే
కొందు రెవ్వాడు తన్నాశ్రిగాంక్షించునట్టుత్తమశ్రేణికు
ద్వ్యద్దయాపూర్ణుఁడై సావ్యయాంగంబు నిచ్చు న్విముక్తా
త్మ లెవ్వాని సేవింతు రానందసింధూపమగ్నాంతరంగుల్
సద్వైకాంతు లెవ్వాని దామేమియుం గోరకం దచ్చరిత్రం
బు గీర్తింతు రెవ్వాడు సర్వేంద్రియద్రష్ట సర్వం బెవండీజ
గత్కల్పనాకారణుం డెవ్వ డధ్యాత్మయోగానుగమ్యుం
డశేషాంత వేదాంత ముద్యచ్చతుర్వేద వేదాంగముల్
సర్వశాస్త్రంబు లెవ్వాని తత్త్వప్రభావంబు బోధించు నె
వ్వాడు వాఙ్మానసాతీతు డెవ్వండు శుద్ధాత్మచేగాక నే
త్రద్వయాగోచరుం డెవ్వ డవ్యక్తుడున్ వ్యక్తుడున్నిర్గుణుం
డుం గుణుండుం గుణాతీతు డెవ్వాడ సాధ్యుం డవేద్యుం
డనాద్యుం డనంతుం డవాచ్యుం డఖిన్నుండు సద్యఃప్ర
సన్నుండు వెవ్వాడు పుంస్త్రీనపుంభావుడుంగాక దిర్య
ఙ్మనుష్యామృతాంధోముఖాకారియుంగాక గర్మప్రకం
సాగుణస్థాన వైకల్య దుస్సత్త్రికాశుండుగాకం బరా
ర్థంబు దర్వాత నియ్యాన్నియుం దానగుం జేతనాచేత
నాంతత్త్వపంచస్వరూపుండు మాయామయుం డెవ్వడా
పంచభూతేశు డెవ్వాడు సర్వేశుడున్ సర్వరూపంబు లె

వ్వానిరూపంబు శక్తి ప్రభుండెవ్వ డేదిక్కుగా లేనట్టి నా
బోట్లకుం దిక్కు యెవ్వాడు సర్వ ప్రపంచంబులందున్న
ప్రాణిసమూహంబులం బ్రోచువా డెవ్వడో యట్టి స
ర్వాంతరాత్ముండు యీశుండు మా రోగ్రబాధన్నిరోధించి
నన్నుం దయంబ్రోచు గాకందు నెంతే మొరంబెట్టినా నే
మి లేకుండుటం జేసి దంతీశుడత్యంత విశ్రాంత చింతాభర
భ్రాంతస్వాంతం బనంతాత్మ పాదద్వయాక్రాంతముం జే
సి తానిట్లనం గా దొడంగెన్ విలోలంబయెం బ్రాణముల్
తావులందప్పె లావింతయున్ లేమ ధైర్యంబు మూర్ఛా
గతంబయ్యె డస్సెన్ శరీరంబు చాలాశ్రమంబయ్యె దీన్ని
వుదప్పన్యులన్నెరుంగం దయాసింధు రావే ననుంగావ
వే దీనునిం గారవించందగుం దావకార్తీయ దాసానుదా
సుండ నిన్నమ్మినాడం ద్వదీయానుకంపా ప్రసాదానుపా
త్రుండ సర్వేశ్వరా నీవు వింటావటే భక్తవాక్యాలు వి
తావటే నీవు బోరానిచోటుల్ నినున్ రక్షణార్థుల్ వడిం
బిల్చుచో వోయియుంటావటే సేవకాభీష్టకష్టంబులన్నివు
గంటావటే నాకు సందేహమయ్యెం దయాంభోనిధీ యా
ర్త్తరక్షా జగన్నాయకా భక్త వాంఛానుసంధాయకా
సాధులోకాటవీచైత్ర యోపద్మనేత్రా పవిత్రా ముని
స్తోత్ర యోదీనమందార రావే దయంజూడవే రక్షణార్థి
న్ననుంగావవేయంచు దాబల్కి నన్నుం జగద్రక్షకుం డి

ళ్ళుడాపన్నుడై బోరుచుగాకంచు దా నింగికిన్నిక్కి వీక్షిం
చుచూ వేడినిట్టూర్పులం బుచ్చుచూ నగ్గజేంద్రుండు గో
ల్పెట్టుచుండంగ నామొఱ్ఱవించడ్డ మెవ్వారలున్ రాక బ్రి
హ్మాదులెల్లూరకేయుండి రంతన్ ముకుందాంఘ్రిదాసో
పకంఠంబు భాస్వద్వికుంఠంబులో నొక్కమూలన్ వరో
ద్యానవాటీనటత్కుందమందార జాతీలతాజాత పుష్పా
సవక్లిన్నభూప్రాంతమం దుల్లసద్వజ్రవైడూర్యయూధం
బు సౌధంబులో మల్లికా పారిజాతాది పుష్పవ్రజానల్ప
శిల్ప ప్రకల్పంబు తల్పంబు మీదన్ రమాదేవి లీలావిలా
సాభివర్ధిష్ణుడావిష్ణుడానాగలోకేంద్ర విజ్ఞాపితానేక
దీనానులాపంబు లాలించి లక్ష్మీ ప్రకేళీ వినోదంబులం
దన్వి చాలించి మోదించి సద్దిక్కులం జూచి సద్భక్తి సం
యుక్త దంతీంద్ర రక్షాపరత్వంబు నంగీకరించంతటా
త్మీయమౌ యోగపట్టంబు జేబట్టి యాకాశమార్గంబునన్
వేగ దానుద్గమించంత వేంచేయుచున్నప్పుడాలచ్చితన్వం
టరా నామె వెన్కందదంతఃపురీవర్తులున్ వారివెన్కన్ స్వ
హంగేంద్రుడున్ వానిపొంతన్ ధనుఃఖడ్గకౌమోదకీ శంఖ
చక్రంబులు న్నారదుండున్ మొదల్గాగ వైకుంఠపట్నంబు
నందున్నవారందరాబాలగోపాలముల్వచ్చిరా సుందరా
స్యారవిందానుసంధానితస్వేదమంద స్మరందవ్రజానంద
వత్కుంతలేందిందిరయ్యిందిరాదేవి గోవిందహస్తారవిం

దంబు చేబట్టుకో బడ్డ కర్పూరగంధప్రభాభాసురో దాంత
విభ్రాంత పైతాపటప్రాంతమై బోవుచూ నంతరంగంబు
నందానువేం చేయుమార్గంబు బేర్కొండ నాథాంగనాలా
పముల్ వీనులాలించెనో దొంగలా సాధువేధన్నిరోధించి
వేదంబులందోచిరో దానవుల్ దేవలోకంబు పై రేగి దండె
త్తిరో దుర్జనుల్ భక్తులంజూచి వక్రాయుధుం డేడి చూ
పించు డంచుం దిరస్కారముం జేసిరో యంచు లోన న్విత
ర్కించి యాశంక నిశ్శంక జేయన్ మదిం జంకి యాపంకజా
గారతా నీలమేఘంబులోనన్ జిగల్ వీలు విద్యుల్లతాలీల
నాచాలగోపాలు వెన్వెంట బోచుండె నంతన్నభఃపద్ధతిన్
దానవానీకజిష్ణుండు విష్ణుండు వేంచేయుటంజూచి బృం
దారకస్తోమ మువ్యోన్నమీరీతిగా బల్కరే తెంచె నారాయ
ణుండల్ల వాడే జగన్నాథు చెంతన్ రమాదేవినిం గంటిరే
శంఖ వాదంబదే ఘోరవిద్వేషణప్రాణవక్రంబు చక్రంబదే
బన్నగధ్వంసియున్ వాడె నేతెంచెనంచు న్సురానీకముల్
మస్తకస్థానవిన్యస్తహస్తాబ్జులై భక్తితోడన్నమఃపా
హి నారాయణా మేదినిస్వానులై మ్రొక్క రాహస్తినా
థవ్యధా వక్రికిం జక్రికిన్ మింట నవ్వేళ నవ్వాసుదేవుండు
సారంగరాట్వ్యాల నాపారవశ్యంబునన్ దేవతాంచన్నమ
స్కారవారంబులీక్షింపకన్ దామనోవేగసంచారుడై పో
యెంటోయంతటం గొంతదూరంబునన్ శింశుమారేభరా

ద్ద్వంద్వసంగ్రామకేళీ క్రియానంతరాకీర్ణ జీర్ణాంబరాం
భఃప్రకామ న్నిజస్థానరింఖత్తురంచద్వంద్వచక్రాభిరామన్
విలోల ద్వళీభంగభీమన్ విలుఠత్కటీసైకతాభోగ సీ
మన్ సమాకీర్ణధమ్మిల్ల శైవాలతేమన్ సముద్ధూత దృగ్నా
రకల్హారధామన్ సమాందోళితగ్రీవ శంఖాభినామన్ వి
నష్టప్రవేష్టామృణాళీ లలామన్ విధూతాస్య పద్మాభిరా
మన్ సుకాసారభామన్ విలోకించి దుష్టాత్మక ప్రాణి
రేఖావియోగంబు చక్రప్రయోగంబు గావించగా చక్ర
మున్ విస్ఫులింగచ్ఛటావర్తి తాంచన్నభశ్చక్రమై గుంభ
గుంభద్గుభీలన్న శబ్దంబుతోడం గొలంకుం గలంకంబుగా
గల్పుచుం జొచ్చి దుర్వారదృగ్భీకరిన్ మాకరిం డాశి కుం
భీంద్ర శుంభత్ప్రదాకర్షణావిష్టమున్ శీర్షముం ద్రుంచి
ప్రాణంబులంబాపె నంతం గజేంద్రుండు మేఘచ్ఛవింబా
సి తీంద్రించు శ్రీరాజభంగిం బ్రదర్శించి సంసారదుఃఖంబు
వీడొఱన్న చంచద్వీరక్రాత్తుచందంబుగా నీరచారంబు ప
ట్టూడ్చి పాదంబులల్లార్చి బృందరత్వంబుతోడం దశా
శావకాహస్తనిర్యత్సుధాంభఃకణ స్నాన విశ్రాంతుడై
యొప్పె నప్పద్మసద్మాధిపుండప్పుడప్పాంగిసన్మాన్యజన్యా
ళిఘూర్ణన్నరాజన్య సైన్యాత్మసైన్యంబు యా పాంచజ
న్యంబు నాచండదిక్షుండలోద్దండ వేదండరాట్కర్ణఘూ
ర్ణాయమానంబుగా నోటబూరించె నాదేవతా ఘూర

భేరీలు ధంధంధణత్కారనాదంబులై మ్రోసె సౌగంధి
కాకుందమందార గంధంబులై మందవాతానుపోతంబు
లున్వీచె భూమింబువుల్వాన వర్షించె సద్గానమానంబు
లై యక్షదేవాంగనాలాస్యముల్ బర్వె నల్దిక్కులందుం
జయధ్వానముల్ నిండె రంగత్తరంగానుషంగాభ్రగం
గాఝరీచంద్రమై సంద్రముప్పొంగె నంతం జెయింబట్టి
యయ్యిందిరాధీశుడాసింధురాధీశునిం దాగొలంకందు
నం దీసి తత్కుంభసంభూత దానాంబువుల్ ద్రోయు
చూ దేహమున్ రాయుచూ దుఃఖమంతంత బోజేసె న
ద్దానవారాతి దోస్స్పర్శనావాప్తిచే దేహదాహంబు
బోయాగజేంద్రుండు తోడేనికల్గూడి ఘీంకారనాదాల
తోనొప్పె నో హూపరీక్షిన్నరేంద్రా మునీంద్రుండుడుయా
దేవలాఖ్యామహాశాపనిర్ముక్తుడై శింశుమారాకృతిన్ వీడి
గంధర్వుడైనట్టి హూహూసమాఖ్యుండు తాదొంటివై
దాల్చి సద్భక్తితో భక్తవాంఛాప్రదాయింభుజంగేంద్ర
శాయింబ్రకీర్తించి జోహారులాస్థన్ సహస్రంబు లర్పించి
యాదేవకారుణ్యముంబొంది యుందండ నమోత్రమాం
గంబుతో బాపనిర్ముక్తుడై యాత్మలోకంబుకుంబోయె గో
విందసంవర్శనస్ఫూర్తిచే ధేనుకాధీశుడజ్ఞాన సంత్యక్తుడై
యావిరాడూప్రదామం బ్రకాశించె రాజేంద్ర యాశిం
శుమారంబుతో బోరినట్టాగజేంద్రుండు పూర్వంబు తా

ద్రావిడాధీశు డింద్రద్యుమ్నాఖ్యుండు పుణ్యాత్ముడున్ వై
ష్ణవాగ్రేసరుం డొక్కనా డొక్క శైలాగ్రభాగంబునన్
వీరనారాయణుంబూజగావించి తా మౌననిష్ఠాగరిష్ఠా
త్ముడైయున్నచో మౌనివర్యుండగస్త్యుండుయచ్చోటికిన్వ
చ్చి పెంపెచ్చగా లేవకం దన్ను బూజింపకున్నట్టి యా
ద్రావిడక్ష్మాపతిన్ మూఢబుద్ధీ కరేణుప్రయోనిస్థలిం బు
ట్టుమంచున్ మహాకోపదీప్తాత్ముడై శాపమిచ్చెం బరీక్షిన్మ
హీపాల యట్లయ్యగస్త్యుం దిరస్కారముం జేసిన ద్రా
విడేశుండు తాగుంజరీయోనియం దుద్భవంబంది పద్మాస
హస్రాలకున్భర్త యయ్యెన్ మరిందద్భటాదుల్ కరిగ్రా
తమయ్యెన్ ధరం గాన బుణ్యాత్మకుల్ విప్రులం గాంచి
యొక్కప్పుడైనంబరీభావముం జేయరా దోపరీక్షిన్మహా
రాజ యగ్గారు కావిష్ణుపాదాబ్జ సేవాతిరేకంబునన్ దివ్య
లోకంబు నంతబునంగ్గై దర్వాత విష్ణుండు యవ్వైష్ణవీ
రత్నమైనట్టి పద్మాలయన్ హాసనందీప సంలాపపూర్వం
బుగానుం బరిష్వంగముంజేసి లాలించుచూ దేవగంధర్వ
సిద్ధాప్సరఃకిన్నర స్తోమ జేగీయమానంబుగా దందశూ
కాంతకారూఢుడై యాత్మగేహంబుకుం బోయెనంచున్
వచించాశుకుం డిట్లనెన్ ధారుణీనాయకా నీకు నాచేత
వాక్రువ్వబడ్డట్టి యీవాసుదేవానుభావంబునా నాగ
రాణ్మోక్షగాంచ త్కథాసారముం బాండర ద్వీపముం

కాలసంధ్యంబు హేమాద్రి తత్కందరారణ్యముల్ బ్రహ్మయున్ శంభుదేనున్ వసించేటి శైలాగ్రముల్ కౌస్తుభోద్దామకామోదకీఖడ్గసౌదర్శనీ పాంచజన్యంబులన్ శ్రీసతిన్ శేష ప్రహ్లాద భేకారిభి ద్వాసుకీ నారదాద్యృషులన్ మత్స్యకూర్మాగ్రి భూదార ముఖ్యావతారంబులం దద్భవత్కృత్యముల్ సోమసూర్యాగ్ను లోంకారమున్ ధర్మసమ్యక్ సుకీర్తుముల్ వేదవేదాంగముల్ శాస్త్రముల్ విప్రగో సాధు సాధ్వీజనంబుల్ విఘాటక్ష్ణకాళిందిసారస్వతీ గౌరి గంగా సునందాది పుణ్యాపగావాగముల్ గశ్యపాది ప్రజాపత్యుల న్నిర్జరస్తోమముం గల్పవృక్షంబు నైరావతంబున్ సుధన్ మానిసజ్జైకస్ధుర్యన్ దేవబ్రహ్మర్షి సందోహముం బుణ్యమానుష్యుల న్నిష్కళంకాత్ములై భక్తితో నర్ధగాత్రంబునన్ లేచి యెవ్వారు కీర్తింతురో యివ్వి కీర్తించగా విందురో వారికిం గీర్తు లెచ్చున్ విపద్దుఃఖముల్లేవు దుస్స్వప్నముల్ గావు పాపావళుల్పోవు భాగ్యావళి న్నేవు సౌఖ్యంబు సిద్ధించు పీడల్ప్రశాంతించు వర్ధిల్లు సంశోభనంబుల్ పరంబాత్మ పాణిగ్రహించెదను యెవ్వారు నిత్యంబు దాడింతురో వారి కాత్మీయపాదాబ్జసేవా సౌనంబున నాద్యులోకంబు దైచేతునంచున్ ముకుందుండు నిష్కర్షగాబల్కి శింఖ చ్రిపుస్వాంత ప్రేంఖంబు శంఖంబుబూరించి శేషాంతకారూఢుడైమించి వేంచేసె

చంచద్బుధానీకమౌళ్ జాలతోషించెనంచున్ వచించాశు
కుం డప్పరీక్షిత్క్షమాజానితో నిట్లనెన్ మన్మథాబ్దంబునం
జ్యేష్ఠమాసోల్లస చ్ఛుక్లపక్షంబులో మాతులుండైన చా
ట్రాతిహన్మంతురావ్ పంతులాజ్ఞాప్రకారంబు నందూరి
వంశాంబుధీచంద్రమ ద్భావనార్య ద్వితీయాత్మజుండైన
గోపాలమూర్త్యాఖ్యుఁడాచంద్ర తారార్కముం గాఁగ
దా జెప్పినట్టీగజేంద్రవ్యథామోక్షణాఖ్యానముర్విం బఠిం
చేటివారల్ శుభైశ్వర్యదీర్ఘాయురారోగ్య సత్పుత్ర పౌ
త్రాభివర్ధిష్ణులై విష్ణుసాయుజ్య మంతంబునన్ వారుబొం
దంగఁబోనంచు నవ్వ్యాసపుత్రుండు వాక్రువ్వఁగా నప్పరీ
క్షిత్తుఁడానంద సంధానితస్వాంతుఁడయ్యెన్సుమా సాంబ
మూర్తీ త్రిలోకప్రవర్తీ మహాంతే జయంతే శుభంతే సదా
స్తు స్తవంతే మహాద్గండ భేరుండఛండీశ చండప్రచండా
యతుభ్యంనమస్తే నమస్తే నమస్తే నమః॥

ఉ॥ చంద్రకిరీటిపేర మృదు చాతురిబాతరలాడ గా
ఢదం। తీంద్రునిదండకంబు రచియించితినించుక సంస్కృ
తాంధ్రవా। క్సాంద్రరసజ్ఞులైన కవిసత్తములారపరీక్ష
జేయుఁడా। త్మేంద్రియజాడ్యజాగసుల దిద్ది మదీయ కవిత్వ
తత్వమున్॥

సంపూర్ణము.



